# మహా శివరాత్రి




రచన

**విద్వాన్, డాక్టర్ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

కార్యదర్శి, ధర్మప్రచారపరిషత్, తి.తి. దేవస్థానములు

★ ★ ★

"శివరాత్ర్యా సమం కించిత్ పావనం న చ విద్యతే ।
శివలోకప్రదా హ్యేషా సకలైశ్వర్యదాయినీ" ॥

★ ★ ★

ప్రచురణ

**ధర్మప్రచార పరిషత్**

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి - 517 501**

మహాశివరాత్రి (తెలుగు)

ప్రథమముద్రణ : 2,00,000

2006, ఫిబ్రవరి

అమూల్యము

ప్రచురణ:

ధర్మప్రచారపరిషత్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి - 517 501
ఫోన్ : 0877-2230893

ముద్రణ :
యాడ్స్‌ప్రింట్, టి.నగర్, చెన్నై-17.

# ముందుమాట

తిరుమల తిరుపతి దేవస్థానమువారు ధర్మప్రచార పరిషత్తు ద్వారా నిరంతరాయంగా పుస్తక ప్రసాదాన్ని భక్తులకు విశేషంగా అందిస్తున్నారు. ఈ సంవత్సరం ఆయా పర్వదినాల వైశిష్ట్యాన్నీ, ఆచరణవిధానాన్నీ, ఫలితాన్నీ, పరమార్థాన్నీ సామాన్యులకు సైతం పఠనగ్రహణయోగ్యంగా వుండేందుకై కృషి చేస్తూ, చిన్న చిన్న పుస్తకాలు ముద్రించి, ఉచితంగా అందజేస్తున్నాము. భక్తులు ఉత్సాహంతో స్వీకరించి, చదివి ఆనందిస్తూ, మా కృషిని అభినందిస్తున్నా రని తెలిసి, శ్రీతిరుమలేశుని దయను నుతిస్తూ, నమస్కరిస్తున్నాము. పాఠకదేవుళ్ళ ఆనందమే ఆనందనిలయుని ఆనందనిలయంకదా!

తిరుపతి, తిరుమల దివ్యక్షేత్రాలు "హరిహరాభేద తత్త్వాన్ని" నిరూపిస్తున్నాయి. తిరుమలవాసుని ఏడు కొండల్లో – కొండల మొదటి తావు (పీఠం) కపిలతీర్థం! ఇక్కడి శివుడు కపిలేశ్వరుడు. అమ్మవారు కామాక్షి కపిలమహర్షి పూజించిన శివలింగం శ్రీ కపిలేశ్వరస్వామి. శివుడు జ్ఞానదాత. కేశవుడు మోక్షదాత. జ్ఞాన ఫలం

మోక్షం. కనుక సప్తగిరిపీఠమైన కపిలతీర్థ క్షేత్రాన్ని దర్శించి, ఇచ్చటి శివుణ్ణి సేవించి, జ్ఞానులై, సప్తావరణాలు దాటి, ఏడు కొండలపై వెలసియున్న శ్రీవారిని దర్శించి, మోక్ష గాములు కావడం విశిష్టమార్గం! ఇందుకే కొండక్రింద జ్ఞానదాత, కొండపైన మోక్షదాత – ఉభయఫల ప్రదాతలై శివకేశవులు కొలువై భక్తులను ఉద్ధరిస్తున్నారు.

మహాశివరాత్రి శివభక్తులకు మహావిశిష్టపర్వదినం! ఈనాడు ఉపవాసం, శివారాధన, నాల్గుయామాల్లో శివునికి అభిషేకం, రాత్రి జాగరణం – భక్తితో నిర్వహించి, మహానందాన్ని అనుభవిస్తుంటారు భక్తులు! మహాశివరాత్రినిగూర్చిన కథా విశేషాలు ఎన్నో వున్నాయి. అన్నీ పూర్తిగా పేర్కొనడం, వివరించడం అలవికాని పని.

'సూక్ష్మంలో మోక్ష'మన్నట్లు చిన్నపుస్తకంద్వారా గొప్ప విషయాలు తెల్పడం, తెలుసుకోవడం అనేవి భగవత్కృపవల్ల, జన్మాంతరసుకృతసాధనవల్ల లభించే సంపదలు! అట్లని వూరకుండటం భావ్యంకాదు. కనుక అన్నిపండుగల్తోపాటు యథావకాశంగా మహాశివరాత్రి విశిష్టతను గూర్చిన విజ్ఞానాన్ని, భక్తజనులకు

మహేశ్వరప్రసాదంగా ఈ చిన్ని పుస్తక రూపంలో అందించే మా ప్రయత్నాన్ని ఆదరించి, సఫలం చేస్తారని అర్థిస్తున్నాము. మున్పటివలెనే ఈ పుస్తకాన్ని సముచితపద్ధతిలో సమకూర్చి యిచ్చిన ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి, శ్రీ చెంచుసుబ్బయ్యగారిని సాదరంతో అభినందిస్తూ, ఇంకా ఎన్నో యిట్టి పవిత్ర కార్యాలు దీక్షాదక్షతలతో నిర్వహించే శక్తిసామర్థ్యాలను శ్రీపద్మావతీశ్రీనివాసకపిలేశ్వరులు అనుగ్రహిస్తారని ఆశిస్తూ...

"ఎందరో మహానుభావులు అందరికీ వందనములు"

సదా శ్రీనివాసుని ధార్మికసేవలో

**ఏ.పి.వి.ఎన్. శర్మ**
ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి

తిరుమల-తిరుపతి
దేవస్థానములు,
తిరుపతి-517 504
19-2-2006.

# వినయాంజలి

శివసంబంధమైన పూజాపర్వదినాల్లో మహాశివరాత్రి విశేష విశిష్ట పర్వదినం. నిరాకారసాకారతత్త్వాలకు ఏకసంకేతంగా ఆవిర్భవించిన శివలింగం మహాతేజస్సుతో ప్రకాశిస్తూ, సకలాన్నీ తనలో లయం చేసుకొంటూంది. చాలప్రాచీనకాలంనుంచీ శివరాత్రిపూజలు, ఉపవాసం, జాగరణ చేస్తున్నట్లు పురాణాల్లో పేర్కొనబడింది. శివరాత్రినాడు రాత్రివేళ నాల్గుయామాల్లో శివుణ్ణి అభిషేకించి, పూజిస్తే విశేషంగా శుభఫలాలు చేకూర్తాయి. పాపాలు పరిహారమవుతాయి. శివరాత్రివ్రతాచరణం భుక్తిముక్తి ప్రదాయకం!

మహాశివరాత్రివ్రతం లింగపురాణంలో వుంది. ప్రతి మాసంలోనూ బహుళచతుర్దశిని "మాసశివరాత్రి" అంటారు. మాఘమాసంలోని బహుళచతుర్దశిని "మహాశివరాత్రి" అంటారు. తిరుపతిక్షేత్రంలో శ్రీకపిలతీర్థం - శ్రీకపిలేశ్వర స్వామి ఆలయం వున్నాయి. శివరాత్రికి శ్రీ కపిలేశ్వరునికి బ్రహ్మోత్సవాలు మహావైభవంగా జరుగుతాయి.

విశేషపర్వదినాలనుగూర్చిన విజ్ఞానం, పరమార్థం సామాన్యప్రజలకు అందాలన్న వుద్దేశంతో తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులు ధర్మప్రచారపరిషత్తు ద్వారా చిన్న

చిన్న పుస్తకాలు ముద్రించి, భక్తులకు పుస్తకప్రసాదంగా అందజేస్తున్నారు. ఇప్పటికి శ్రావణపూర్ణిమ, వైకుంఠ ఏకాదశి, రథసప్తమి విశేషాలను వివరించే పుస్తకాలు ముద్రించి, భక్తులకు అందించినాము. ప్రస్తుతం **"మహాశివరాత్రి"** పుస్తకాన్ని అందిస్తున్నాము. మాన్యశ్రీకార్యనిర్వహణాధికారిగారి ఆదేశానుసారం తమిళభాషలో కూడ ఈ పుస్తకాన్ని ముద్రించి, తమిళభక్తులకు అందిస్తున్నాము. క్రమంగా పుస్తక ప్రసాద సాహిత్యాన్ని ఇంకా కొన్నిభాషల్లోనూ ప్రచురించడం జరుగుతుంది. ప్రజల వద్దకు భక్తిసాహిత్యాన్ని చేర్చడం ధర్మప్రచారపరిషత్ ఆశయాల్లో ఒకభాగం. ఈ కృషియే ఇలాంటి పుస్తక ప్రసాదం! ఏ పండుగనైనా, వ్రతాన్నైనా, పూజనైనా - తెలిసి ఆచరించడంతో ఎంతో ప్రయోజనం, ఆనందం సిద్ధిస్తుంది. భక్త మహాశయులకు ఈ పుస్తకప్రసాదం చెక్కు చెదరని భక్తి జ్ఞానానందపదార్థమై పెన్నిధిగా శోభిస్తుం దని భావిస్తున్నాము. తిరుమల శ్రీవేంకటేశ్వరుడు, తిరుపతి శ్రీకపిలేశ్వరుడు సకలైశ్వర్య ప్రదులై అందరినీ రక్షింతురుగాక!

ఇట్టి రచనావకాశం కల్పించిన తి.తి.దే. అధికారులకు కృతజ్ఞతావందనములు.

సదా శ్రీవారిధార్మికసేవలో

తిరుపతి,
20-2-2006.

**పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

# లింగాష్టకము

1. బ్రహ్మమురారిసురార్చితలింగం,
నిర్మలభాసితశోభితలింగమ్ ।
జన్మజదుఃఖవినాశకలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥

2. దేవమునిప్రవరార్చితలింగం,
కామదహనకరుణాకరలింగమ్ ।
రావణదర్పవినాశనలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥

3. సర్వసుగంధసులేపితలింగం,
బుద్ధివివర్ధనకారణలింగమ్ ।
సిద్ధసురాసురవందితలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥

4. కనకమహామణిభూషితలింగం,
ఫణిపతివేష్టితశోభితలింగమ్ ।
దక్షసుయజ్ఞవినాశనలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥

5. కుంకుమచందనలేపితలింగం,
పంకజహారసుశోభితలింగమ్ ।
సంచితపాపవినాశనలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥
6. దేవగణార్చితసేవితలింగం,
భావైర్భక్తిభిరేవచ లింగమ్ ।
దినకరకోటిప్రభాకరలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥
7. అష్టదళోపరివేష్టితలింగం,
సర్వసముద్భవకారణలింగమ్ ।
అష్టదరిద్రవినాశనలింగం,
తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥
8. సురగురుసురవరపూజితలింగం,
సురవనపుష్పసదార్చితలింగమ్ ।
పరమపదం పరమాత్మకలింగం
తత్ప్రణమామి సదాశివలింగమ్ ॥

## ఫలశ్రుతి

లింగాష్టక మిదం పుణ్యం యః పఠే చ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహ మోదతే ॥

"నమ శ్శివాయ"

# మహాశివరాత్రి-ఆధ్యాత్మికస్ఫూర్తి

మాఘబహుళచతుర్దశినాటి అర్ధరాత్రికాలమున పరమ శివుడు కోటిసూర్యకాంతులతో లింగరూపమున ఆవిర్భవించినాడు. కనుక ఈనాటిఅర్ధరాత్రినుండి చతుర్దశి ఉన్నప్పుడే మహాశివరాత్రి. ఈ మాఘమాససంబంధమువలెనే ప్రతిమాసమునను బహుళచతుర్దశి 'మాసశివరాత్రి' అయినది. మహా శివముగల రాత్రి – మహాశివునియొక్క రాత్రి – మహాశివరాత్రి. శివు డనగా – బ్రహ్మానంద స్వరూపుడు. నిర్వికారుడు గనుక శమించియుండవా డనియు ఇతనియందు సజ్జనుల మనస్సులు ఉండు ననియు, సాధువుల మనస్సులందు శయనించి యుండు వాడనియు. సకలశుభములతో కూడినవా డనియు, అర్థములు. 'శివము' అనగా మంగళము, శుభము, కైవల్యము, శ్రేయస్సు. రాత్రి అనగా సుఖము నిచ్చునది. కనుక గొప్ప శుభముతో కూడినదియు, పరమసుఖమును ఇచ్చునదియు, మహా శివస్వరూపమైన బ్రహ్మానందమును ప్రసాదించునదియు మహాశివరాత్రి! శివుడు మహాతేజోలింగరూపమున ఆవిర్భవించిన సన్నివేశము – 18 కల్పములలో – ఈశానకల్పమున జరిగినది. ఈ సందర్భములో

శ్రీమన్నారాయణుడు శ్వేతవరాహరూపము దాల్చి, శివలింగప్రాదుర్భవస్థాన మును చూచివచ్చుటకై యత్నించినందున - ఆనాటి నుండి ఈ కల్పమునకు "శ్వేతవరాహకల్ప" మని పేరు వచ్చినది. పరమేశ్వరుడు సర్వవ్యాపకు డయినప్పుడు అతనికి ప్రత్యేకముగా ఒకరూపమనునది లేదు. అన్నియు తానే! కాని అందరికిని కనిపించవలె ననెడి అనుగ్రహముతో పరమేశ్వరుడు 'సాంబమూర్తి' (అంబ = పార్వతి, సాంబ = స + అంబ = పార్వతితో గూడినవాడు) యై ఆవిర్భవించినాడు. కేవలజ్ఞాన రూపము నిరాకారము. జ్ఞానము తేజోరూపము. ఆ జ్ఞానతేజమే రాశీభూతమై, జ్యోతిర్మయలింగముగా సాక్షాత్కరించినది. రూపము కంటికి కనిపించవలెనన్నచో జ్యోతిస్సు (కాంతి) అవసరము. కనుకనే శివుడు మొట్టమొదట జ్యోతిర్లింగమై, పిదప సాంబ శివుడై - విష్ణుబ్రహ్మలకు గోచరించినాడు. లింగ మనగా - ప్రకృతిలో లీనమై యున్న పరమాత్మ స్వరూపమును తెలుపునది. ఆ స్వరూపమును పొందించునది - అనగా అనుభవింప జేయునది - అని అర్థము. కనుక నిరాకారమై, సర్వవ్యాపకమైన సచ్చిదానంద శివస్వరూపము. సాకారమై, సర్వజ నానందకరముగా నేత్రోత్సవముగా గోచరించిన మహాపవిత్రపర్వదినము - శివరాత్రి. కృష్ణపక్షములోని చీకటి - జీవుని ఆవరించిన

మాయాంధకారము. జ్ఞానదాతయగు పరమశివుని కృపవలన జీవుడు మాయనుండి ముక్తుడై, ఆత్మ స్వరూపమును గుర్తించి, సర్వవ్యాపకమయిన ఆనంద తేజమును శివలింగరూపములో దర్శించి, జీవన్ముక్తుడు కావలె ననెడి సదాశయముతో, జీవితమును సత్యశివ సుందరముగా తీర్చిదిద్దుకోవలయు నను శుభాకాంక్షలతో – అట్లు భావించి, దర్శించి, తరించిన మనపూర్వులు శివరాత్రిని పర్వదినముగా నిర్ణయించినారు. "జాగ్రత్స్వప్నసుషుప్తిరూపం – అవస్థాత్రయం, ఆత్మరూపేణ – శివాభిన్నస్వరూపేణ, రాతి – ఆదదాతి – శివరాత్రిః" అని వ్యుత్పత్తి – కనుక ఆధ్యాత్మికతత్త్వాను భూతి నొంది, "శివోఽహమ్" అను పరమాద్వైతస్థితి సిద్ధించుటయే శివరాత్రి ఫలము! ఇది యోగరాత్రి! శివరాత్రిఎల్లరికిని భుక్తి ముక్తులను ప్రసాదించు పరమవ్రతము. శివపూజకు, శివరాత్రి వ్రతమునకు భేద మున్నది. వేదములలో శివుడు రుద్రుడుగా పేర్కొనబడినాడు. సంసార దుఃఖమును నాశనము చేయువాడు, వేదరూపమున ధర్మమును పొందింప జేయువాడు, మున్నగు నర్థములు రుద్రశబ్దమున కున్నవి. సహస్రారకమలమున అర్ధమాత్రాస్వరూపమున నిలిచిన పరతత్త్వమే శివుడు. శివరాత్రినాడు శివునికి ధారాపూర్వకముగ చల్లని నీటితో అభిషేకము గావించవలెను. ఇది యోగశాస్త్ర రీత్యా – సహస్రారకమలమున ప్రకాశించు సదాశివ

తత్త్వామృతము వర్షించుటకు ప్రతీక. శివరాత్రి విశేషములలో, ఉపవాసము, రాత్రివేళ అర్చనలు, చతుర్దశీయుక్తమైన అమావాస్య మున్నగునవి ప్రముఖ మైనవి. ఇందలి ఆధ్యాత్మిక రహస్యములను గమనింతము.

ఉపవాస మనగా నిరాహారియై యుండుట అనునది సామాన్యార్థము. ఆహార మనగా "మనస్సుతో, బుద్ధితో, ఇంద్రియములతో స్వీకరింపబడునది" అని అర్థము. సంస్కార రూపమున మనస్సు స్వీకరించునది సూక్ష్మాహారము. పంచ జ్ఞానేంద్రియముల ద్వారా మనస్సు స్వీకరించునది స్థూలాహారము. ఇది శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకము శరీరమునకు స్వీకరించు అన్నము మున్నగునది స్థూలతరాహారము. 'ఉపవాస' మనగా 'సమీపవాసము'. మనశ్శరీరములను శివునిసమీపమున నుంచుటయే శివరాత్రినాటి ఉపవాసము. కనుక కేవలము ఆహార రూపవస్తువులను స్వీకరింపకుండుటయే గాక - సూక్ష్మ, స్థూల, స్థూలతరాహారములను వదలు టయే నిజమైన ఉపవాసము. ఇట్టి తాత్త్వికమైన ఉపవాసముచేసినపుడే "శివోఽహమ్" స్థితి అనుభవింపబడును. కేవల బాహ్యానుష్ఠానము నిష్ప్రయోజనము! ఈ విశాలబ్రహ్మాండమున సృష్టిప్రళయము లనెడి రెండు విభిన్నప్రవాహములు నిత్యము ప్రవహించు చున్నవి. కాల

ప్రవాహమున రాత్రి - పగలు అను రెండుచీలిక లున్నవి. మనస్సునందును ఈ సృష్టి ప్రళయము లున్నవి. ప్రకృతియందు నిత్యసృష్టి, నిత్య లయము గలదు. ఇది ఏకత్వమునుండి భిన్నత్వమునకు, భిన్నత్వమునుండి ఏకత్వమునకు చేర్చు మహాశక్తి. కార్యకారణరూపము. పగలు కార్యరూపము. రాత్రి కారణరూపము. రాత్రిలో సర్వము లయించియుండి, పగలు సృష్టిరూపమున కార్యము జరుగును. కారణము ఏకరూపము. కార్యము నానారూపము. శివరాత్రినాడు అర్ధరాత్రివేళ శివుడు ఏకాకారతేజోలింగ రూపమున సాక్షాత్కరించుటచే" సర్వసముద్భవ కారణలింగ" మ్మని లింగాష్టకస్తోత్రమున నున్నది. కాగా మనః ప్రాణేంద్రియ ములు ఆత్మసన్నిధిలో చేరి, ఆనందించుటయే రాత్రి. అనగా పగలు విషయానందమగ్నములయిన కార్యరూప మనః ప్రాణాదులు, రాత్రి కారణరూపశివసన్నిధిలో తమతమ కార్యములు చాలించి, నిర్విషయానందస్థితిలో సుఖించుటయే శివరాత్రి. పగలు భిన్నత్వము. రాత్రి ఏకత్వము.

చతుర్దశి - అమావాస్య. అమా = కూడిక; వాస్య = వసించియుండుట. అనగా = ఈరోజు = సూర్య చంద్రులు కూడికొనియుందురు. ఆధ్యాత్మికముగా సూర్యుడు - పరమాత్మ, చంద్రుడు జీవాత్మ. జీవాత్మ పరమాత్మతో చేరుటయే యోగ సాధనలో చివరిదశ. కనుక అమావాస్య

అద్వైత పరమానందమునకు సంకేతము. ఉపాసనాశక్తి లేనిదే ఈ అభేదస్థితి లభింపదు. కనుక చతుర్దశి అవసరమైనది. చతుర్దశినాడు చంద్రుడు సూర్యునికి అత్యంతసమీపమున రేఖామాత్రముగ నుండును. అట్లే సాధనకాలమున జీవాత్మ పరమాత్మసన్నిధానమున రేఖామాత్రదూరమున భేదస్థితిలో నుండును. మాఘబహుళచతుర్దశినాడు జీవాత్మ – పరమ శివునికి అత్యంతసమీపమున నుండును. సాధన – ఉపాసన తీవ్రతరమైనపుడు – చతుర్దశిస్థితినుండి – అమావాస్యస్థితి అనగా శివైక్యస్థితి సిద్ధించును. ఇట్టి శుభలగ్నమే అర్ధరాత్రి లింగోద్భవకాలము! ఇదియే మహాశివరాత్రి! ఇట్లు ఆధ్యాత్మికముగ ఆచరించిననే శివరాత్రివ్రతము సార్థకము. సఫలము అగును. అద్వైతానుభూతియే శివరాత్రి!

**జాగరణము** : జాగరణ మనగా ఏదో పిచ్చాపాటి మాటలతో, వినోదకార్యక్రమములతో మేల్కొనుట కాదు. ప్రకృతిలో నిద్రాణమైయున్న శివశక్తిని, శివపూజా భజన లీలా శ్రవణాదులతో మేల్కొల్పి, తాను శివుడై, సర్వమును శివస్వరూపముగా భావించి, దర్శించుటయే నిజమైన జాగరణము. అప్పుడు శివపూజలో సాపూర్పయము, శివభజనలో సామీప్యము, శివభక్తులతో కూడి, శివ విషయములు ప్రసంగించుటలో సాలోక్యము. శివ ధ్యానములో సారూప్యము సిద్ధించునని ఆదిశంకరుల మాట

ప్రత్యక్షర ప్రత్యక్ష సత్యమగును. చతుర్విధముక్తులును ఇహలోకముననే ఈ దేహముతోనే స్వానుభవములోనికి వచ్చును. ఈ నాల్గింటిని శివరాత్రినాడు ప్రత్యక్షముగా సాధించుటయే శివరాత్రి జాగరణము. నాల్గుయామముల పూజలతో మనోబుద్ధి చిత్తాహంకారములు నాల్గును పరిశుద్ధములు కావలెను. ప్రపంచము అశాశ్వత మనియు, బ్రహ్మ మొక్కటే శాశ్వత మనియు గ్రహించి, మనబుద్ధిని మేల్కొల్పుటయే జాగరణము.

శివరాత్రిమాహాత్మ్యకథలలో బిల్వవృక్షము, వ్యాధుడు (వేటాడి జీవించు బోయ), జింకలు ప్రధానములు. మానవదేహమే - ఈ సంసారమే - బిల్వవృక్షము. బిల్వపత్రమునకు గల మూడు ఆకులు త్రిగుణములు. కాడ మనస్సు. కామక్రోధాదులే ముండ్లు. కొమ్మలే శరీర భాగములు. ఈ జీవాత్మయే సంసార బిల్వ వృక్షము నెక్కిన "అంకిలుడు" - అను వేటగాడు. (అంకిలుడు అనగా ఇట జీవాత్మ అను గుర్తుగలవాడు.) ఇంద్రియరూప బాణములతో, విషయరూప పక్షి జంతువులను వేటాడుట ఇతని ప్రవృత్తి. ఈ ప్రాకృతజీవుడు శుద్ధజీవుడై తనసమస్తకర్మలను, కర్మఫలములను భగవంతునికి అర్పించినప్పుడే మోక్షము చేకూరును. కనుక దేహమనెడి బిల్వవృక్షము నెక్కి త్రిగుణముల నెడి బిల్వపత్రములను కోసి, గుణాతీతుడైన పర

మేశ్వరునిశిరస్సుపై అర్పించుటయే బోయ చేసినపుణ్య కార్యము! ధర్మభక్తిజ్ఞాన వైరాగ్యములే అతనిని ప్రబోధించిన జింకలు, బోయను భయపెట్టిన క్రూర మృగములే కామాదులు. కాని అతని ప్రారబ్ధ కర్మ ఆనాటితో తీరుటచే – అవి ఏమియు చేయజాలక పోయినవి. అతని జన్మాంతర సుకృతము బిల్వ వృక్షము నెక్కించినది. బిల్వము మోక్షలక్ష్మినివాసస్థానము. బిల్వమనగా 'సేవకుని పాపమును పోగొట్టునది', అని వ్యుత్పత్తి. బిల్వవృక్షము నెక్కినందున అతని పాపములు అన్నియు నశించినవి. అప్రయత్నముగ జరిగిన జాగరణముచే బిల్వార్పణముచే – అతనికి కైలాసము లభించినది. తెలియక చేసిన బిల్వపూజ, జాగరణము, ఉపవాసము – అంతటి ఫలము నీయగా – ఇక ఇందలి ఆధ్యాత్మిక తత్త్వరహస్యములను గుర్తించి, శివరాత్రివ్రతమును ఆచరించువారికి గలుగు మహాఫలము వర్ణనాతీతము. వాచామగోచరము ఆత్మైకవేద్యము. మృత్యుంజయునిఆరాధన మృత్యుంజయ త్వమును చేకూర్చుననుట అనుభవసిద్ధము! సంవత్సరమునకో, నెలకో ఒకరాత్రి కాక – ప్రతిరాత్రిని నిజమైన శివరాత్రిగా మార్చుకొన్నపుడే జీవితము శివమయముగా పరిణమించి, అద్వైతానందానుభూతితో ''శివోఽహ''మ్మగును. సంవత్సరములో ఐదురకాల శివరాత్రులు ఆచరణ యోగ్యము లని పెద్ద లందురు.

1) నిత్యశివరాత్రి – ఇది ప్రతి నిత్యము శివారాధనకై సంకల్పించి, పూజించురాత్రి. 2) పక్ష శివరాత్రి – 15 రోజుల్లో అనగా శుక్లపక్ష, కృష్ణపక్షచతుర్దశి రాత్రి శివారాధన గావించుట, 3) మాసశివరాత్రి – ప్రతి మాసములో కృష్ణపక్షచతుర్దశిరాత్రి శివారాధన గావించుట. 4) మహాశివరాత్రి – మాఘబహుళచతుర్దశి రాత్రి గావించు శివారాధన. 5) యోగశివరాత్రి – యోగి తన యోగమహిమతో యోగనిద్రలో సమాధిస్థితి నొందు రాత్రి. ఇందలి ఐదు శివరాత్రులలో అన్నింటిని ఆచరింపకున్నను, సంవత్సరమునకు ఒక్కమారు మాఘమాసబహుళ చతుర్దశినాటి అర్ధరాత్రి సంభవించు మహాశివరాత్రిని శివారాధనతో సార్ధకము చేసికొన్నను ధన్యత నొందవచ్చును.

సామాన్యముగా రాత్రివేళ స్త్రీదేవతాపూజలు (అమ్మవారి పూజలు), పగటివేళ పురుషదేవతాపూజలు నిర్వహింతురు. కాని ఒక్క శివరాత్రికి మాత్రమే రాత్రి నాల్గు యామములందును శివుని పూజించుటచే ఈ మహాశివరాత్రికి గల విశిష్టత తెలియుచున్నది. ఈశివరాత్రి – పగలు, రాత్రి ఉపవాసముతో ఉండి, నిర్వహించునది. చతుర్దశి కనుక – కర్మేంద్రియములు ఐదు, జ్ఞానేంద్రియములైదు, అంతఃకరణ చతుష్టయము (మనోబుద్ధి చిత్తాహంకారములు) (5+5+4 = 14) శివార్పణముగావించి, శివానందానుభూతినొందుట

ఇందలి ఆంతర్యము. శివరాత్రినాడు నాలుగుయామము లందును శివలింగమును నాల్గు విధములగు వస్తువులతో అభిషేకింతురు. శివుడు అభిషేకప్రియుడు కదా!

మొదటి యామమున పాలతో అభిషేకము. తామర పూలతో పూజ. పెసరపప్పు, బియ్యము కలిపి పులగమువండి శివునికి నివేదన. ఋగ్వేదమంత్రములు పఠించవలెను. రెండవ యామమున పెరుగుతో అభిషేకము. తులసీదళములతో అర్చన. పాయసము నైవేద్యము. యజుర్వేదమంత్రపఠనము. మూడవ యామమున నేతితో అభిషేకము. బిల్వదళములతో పూజ. నూగుల పొడి కలిపిన పదార్థము (నూగు చిమ్మిలి) నైవేద్యము. సామవేదమంత్ర పఠనము. నాల్గవయా మమున తేనెతో అభిషేకము. నల్లనికలువపూలతో పూజ. కేవలము అన్నము నైవేద్యము. అధర్వణవేదమంత్ర పఠనము. ఇట్టిపూజ వారివారిఅవ కాశమునుబట్టి ఇంటనే శివలింగమునకుగాని, శివా లయమునందలి శివ లింగమునకుగాని నిర్వహించవచ్చును.

అభిషేకవేళలో శివుని దర్శించుట మహాపుణ్య ప్రదము. శివరాత్రినాడు బిల్వపూజ ముఖ్యము. బిల్వము అనగా మారేడు. ఇది మాడు ఆకులు ఒకే కాడకు కలిసియున్న పత్రములు గలది. బిల్వదళము, బిల్వ పత్రము అని అందురు. బిల్వమనగా "బిలతి కుష్ఠాదీన్ - బిల్వః. బిల భేదనే" -

కుష్ఠాదులను పోగొట్టునది. "సేవకస్య పాపం బిలతి, హినస్తి" – సేవకుని పాపమును పోగొట్టునది – అని వ్యుత్పత్తులు. దీనికి మాలూర మనియు పేరు. 'మల్యతే దేవైః' – దేవతలచే ధరింపబడునది – బిల్వము సకల దేవతలకు ప్రియమైనది. శ్రీ ఫలమనియు పేరు. లక్ష్మీప్రదమైనది, లక్ష్మీప్రియమైనది అని అర్థములు. బిల్వము ఓషధీజాతికి చెందినది. పంచ బిల్వము లని ప్రసిద్ధి చెందిన – తులసి, మారేడు, వావిలి, ఉత్తరేణు, వెలగ – అనువానిలో బిల్వము (మారేడు) చేరినది. ఈ యైదును బిల్వములే – అనగా పాపనివారకములు.

మారేడు (బిల్వము) స్పర్శ, వాసనకూడ ఆరోగ్య ప్రదమే! దీని వేరు లేదా ఆకురసము కషాయము గావించి, సేవించినచో ఉష్ణమును తగ్గించును. మేహవ్యాధిని తొలగించును. పైత్యమును తగ్గించును. ఆకలిని పెంచును. వేరు కషాయము గుండెదడను పోగొట్టును. వేరుగంధము సర్పవిషమును హరించును. పత్ర కషాయము ఉబ్బసమును, వాంతులను హరించును. దీని పూలను నీళ్లలో నానబెట్టి, కాచి, ఆ నీటిని సేవించుటచే కలరా మొదలగు అంటువ్యాధులు తొలగును. బిల్వపత్రములను ఎండబెట్టి, పొడిచేసి, నిత్యము సేవించినచో 'రక్తపోటు' (బి.పి.) తగ్గి పోవును. దశమూలములలో మారేడువేరుకూడ నున్నది. దీని కాయలు, గుజ్జు శిరోవ్యాధుల నివారణలో మిక్కిలి

ఉపకరించును. ఇట్లు బిల్వము మహౌషధీగుణములు విశేషముగా నున్న ప్రశస్త వృక్షము. మాఘమాసమున వాతావరణము శీతలమై, వ్యాధి కారకములగు సూక్ష్మక్రిములతో కలుషితమై యుండును. కనుకనే మాఘమాసమంతయు సాయంకాలము శివునికి రుద్రాభిషేకము గావించి, బిల్వపత్రములతో అర్చించుటవలన ఇంట వాతావరణము ఆరోగ్యప్రదమై యుండును. పంచబిల్వములుగా నున్న ఆకులు ఎండినవైనను, ముందురోజు పూజకు ఉపయోగించిన వైనను – వాటిపై నీరు చల్లి, మరల పూజకు ఉపయోగింపవచ్చు నందురు. బిల్వము శివునికి పరమప్రీతికరము కనుక "ఏకబిల్వం శివార్పణమ్" అని బిల్వాష్టకాదులు, బిల్వాష్టోత్తరశతనామావళులు శివ సంబంధములై ప్రసిద్ధి నొందినవి. ఇందలి త్రిదళములు – త్రిలోకములకు, త్రిగుణములకు, త్రికరణములకు, త్రిజన్మలకు, – ఇలా త్రిసంఖ్యాకములైన అసంఖ్యాక తత్త్వములకు సంకేతములు. ఇన్ని తత్త్వములను మహాతత్త్వ సంకేతమైన శివలింగమునకు అర్పించుటచే జీవుడు శివస్వరూపుడై "శివోఽహమ్" అనెడి దివ్యాద్వైతానుభూతి నొందును. ఒక్క బిల్వదళము శివునికి అర్పించుటచే "కోటియజ్ఞఫలము" లభించునని ఆర్షవాక్యము! జమ్మి, ఉసిరిక, గరిక – చేర్చి అష్టబిల్వము లనియు ప్రసిద్ధి కలదు.

# శివలింగము

సామాన్యముగా లింగ మనగా చిహ్నము (గుర్తు) అని అర్థము. 'శివునికి గుర్తు' అనునర్థములో 'శివలింగ'మని రూఢి. ఇది ఒక సంకేతమే కాని, వాస్తవమునకు ఇదే శివుని రూప మని కాదు. ధ్యానానుగుణముగ శివుని రూపములు అనేకము లున్నవి. లింగములో సాకార నిరాకారములు లీనమై యున్నవి. సర్వమును తనయందు లీనము గావించుకొనునది కనుక లింగ మని పేరు. ప్రళయాగ్నిలో సర్వమును భస్మమై శివలింగములో లయించును. (లీనమగును) మరల సృష్టిప్రారంభములో అందుండియే ఉద్భవించును.

పంచలింగములు, ద్వాదశ జ్యోతిర్లింగములు ఇవ న్నియు విశ్వమునకు, అందలి తత్త్వములకు సంకేతములు. విశ్వమే విశ్వేశ్వరతత్త్వముకదా! శివలింగము ఆపాతాళన భస్థలాంత వ్యాప్తము - అనగా సర్వవ్యాప్తము! శివలింగములు అనేక విధములు. అందు సువర్ణ నిర్మితలింగము ముక్తి నిచ్చును. వెండి లింగము ఐశ్వర్యమును, వైడూర్యలింగము శత్రునాశమును, స్ఫటికలింగము సర్వవాంఛాఫలప్రదత్వ మును, కల్గించును. (కాని రాగి, కంచు, సీసము, ఎఱ్ఱ చందనము, శంఖము, ఇనుము లింగములు కలియుగములో నిషేధింపబడినవి). పాదరస లింగము మహైశ్వర్య ప్రదాయకము. మహా ప్రభావ సంపన్నము. పాదరసమునకు

'పారద' మనిపేరు. "రోగములను నశింపజేయునది" అని వ్యుత్పత్తి. ఇందు 'ప = విష్ణువు, ఆ = పార్వతి, ర = శివుడు, ద = బ్రహ్మ – అని అర్థములు కనుక 'పారద' – (పాదరసము) త్రిమూర్త్యాత్మక పరాశక్తి స్వరూపము. పాదరసలింగపూజ జీవితములో ఒక్కమారైనను చేయుట సకలాభ్యుదయప్రదము. బాణలింగ పూజ ముక్తి ప్రదము. బాణలింగములు నర్మదా నదిలో లభించును. ఇంద్రాదిదేవతలును బాణలింగములను పూజించి నా రని పురాణోక్తి. ఇందు ఆవాహన విసర్జనము లుండవు.

## వేదములలో శివుడు

ఋగ్వేదములోని మూడు సూక్తములలో (మం 114 నూ 2-33, 7-46) రుద్రుని స్తుతియున్నది. కృష్ణయజుర్వేదములో చతుర్థ కాండము 5,7 ప్రపాఠకములకు రుద్రాధ్యాయ మనిపేరు. వీటిని నమక చమకము లందురు. శుక్లయజుర్వేదములోని 16వ అధ్యాయము రుద్రదేవతా కమైనది. అథర్వవేదములో 11వ కాండములోని 2వ సూక్తములో రుద్రమాహాత్మ్య మున్నది. పురాణములు శివప్రభావమును అనేకరీతుల వర్ణించినవి.

# శివపూజా మహిమ

శివధ్యానము నిరంతరము ఎక్కడ జరుగునో అక్కడ సమస్త మంగళము, సర్వసిద్ధులు, సాలోక్యసామీప్య సారూప్య సాయుజ్యములు అనబడు చతుర్విధపురుషార్థములు కాచుకొని యుండును. శివస్మరణవల్ల ఎట్టి దారుణ సంకటములైనను పటాపంచలైపోవును. అంతేకాక ఎన్ని విఘ్నములు సంభవించినను అవి అన్నియు తొలగిపోవును అనుటలో ఎట్టి సంశయములేదు. తెలియకుండ అమృతమును పానముచేసినచో పానము చేసినవారు ఎట్లు అమరులు అగుదురో అదేవిధముగా ఎవ్వరి నామోచ్చారణము వల్లనైనను, హాస్యమునక యినను, నిందించుటకు నైనను శివస్మరణ చేసినను, అన్నిపాపములు భస్మమైపోవును. కావున భక్తిశ్రద్ధలతో ఏకాగ్రచిత్తముతో, శివధ్యానము చేసిన మహాభక్తుల పుణ్యమునకు హద్దు లుండవు. ఈవిధముగా శివునిపై పరమప్రీతిగల్గిన ఉత్తమ సంస్కారముగల మానవులు అత్యంతపవిత్రమైన శివరాత్రినాడు ఉపవాసముచేసి, జాగరణసల్పి, బిల్వ దళములతో క్రమముగా శివార్చన చేసినచో వారిజన్మాంతర పాపశేషములు దహింపబడుటలో ఎట్టిసందేహము లేదు. ప్రతినిత్యము బిల్వములతో శివార్చన చేయువారు మిక్కిలి పుణ్యవంతులు. అట్టి భక్తుల దర్శన మాత్రముచేతనే అన్నిపాపములు తొలగిపోవును. ప్రాతః

కాలశివ దర్శనముచే గతరాత్రి చేసినపాపములు, మధ్యాహ్న శివదర్శనముచే జన్మాంతరదోషములు పరిహారమగును. సంధ్యాకాలములో శివదర్శనమును ప్రేమపూర్వకముగా చేసినచో వెనుకటి ఏడుజన్మములలోని పాపములు భస్మమగును. శివరాత్రి మహిమను వర్ణించుటకు ఆదిశేషునికిని తరముగాదు. అరవై సంవత్సరములకు ఒకసారివచ్చుకపిలాషష్ఠికంటె, అర్థోదయ మహోదయాది సంక్రమణగ్రహణాదిపర్వకాలములకంటె, శివరాత్రియే శ్రేష్ఠమైనది, వసిష్టవిశ్వామిత్రా దిమునీశ్వరులు, దేవతలు, గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు, చారణులు, విద్యాధరులు శివరాత్రివ్రతమును ఆచరించుదురు. ఈ సందర్భము నందు శౌనకాది మహర్షులకు సూతపౌరాణికులు చెప్పిన పావనమైన కథ ఒకటికలదు. దానిని శ్రోతలు సావధాన చిత్తముతో శ్రవణముచేసి ధన్యులగు రుగాక! మాసములలో మాఘ మాసము విశేష మహిమాన్వి తమైనది. అందుకృష్ణపక్షచతుర్దశి శివరాత్రి కనుక అద్భుతమైన మహిమ గలదిగా శ్రీవ్యాస మహర్షి వర్ణించిరి. ఆ మహిమను ఆదరభావముతో శ్రవణము చేయవలెను. వింధ్యపర్వతప్రాంతమున శాకలనగరమున అంకిలుడు అను ఒకబోయవాడు నివసించుచుండెను. అతడు మృగములను వేటాడుచు నిర్దయాస్వభావముగల్గి ఎల్లప్పుడు నిషిద్ధకర్మలనే ఆచరించుచుండెను. ఒకనాడు దురాచార

పరుడైన ఈ వ్యాధుడు పచ్చనికవచమును ధరించి, ధనుర్బాణములు తీసికొని, చంకనొక పగ్గమును తగిలించుకొని, ఘోరారణ్యమును ప్రవేశించెను. ఆ అడవిలో మిగుల రమణీయమైన ఒక శివాలయ ముండెను. ఆదినము శివరాత్రి గావున నలుదిక్కులనుండి భక్తులు విశేషముగా ఆ ఆలయమునకు వచ్చుచుండిరి. ఆ శివాలయము ఆకాశమునంటు పతాకములతో, ప్రకాశించు రత్న కలశములతో, శుద్ధమైన కైలాస శిఖరములవలె నొప్పుచు, మిక్కిలి రమణీయముగా నుండెను. "గర్భగుడి"లో మణిమయమైన శివలింగము స్థాపింపబడియుండెను. వచ్చిన భక్తులు భక్తితో అభిషేకాదిషోడశోపచారములచే స్వామిని పూజించు చుండిరి. బ్రాహ్మణులు రుద్రమును చెప్పుచుండిరి. తాళమృదంగములతో శివభజన జరుగుచుండెను. ఆధ్వనిచే ఆ ప్రాంతమంతయు మారుమ్రోగుచుండెను. దివ్యమైన పుష్పముల పరిమళము దశదిశలు వ్యాపించియుండెను. లక్షల కొలది దీపముల ప్రకాశము సూర్యచంద్రుల ప్రకాశమునే తిరస్కరించు చుండెను. ఈ సందర్భమందు ఆ వ్యాధుడు అచ్చటికి వచ్చి ఆ ఉత్సవమునంతయు సంభ్రమముతో చూచుచు అట్టహాసముతో నవ్వుచు ఇట్లు అనుకొనెను.

"ఆహా! ఈ ప్రజలు ఎంతటి మూర్ఖులు! ఈ పూజలకై ఎంతో ద్రవ్యమును వ్యర్థము చేయుచున్నారు. ఇదంతా

శిలామయము. లోపల శిల! బయటశిల! ఇక దేవత్వము ఎక్కడ నుండి రాగలదు? మృష్టాన్నభోజనము చేయుటమాని ఉపవాసము చేసి, బాధపడుచున్న వీరికి పిచ్చిపట్టినట్లు ఉన్నది" – ఇట్లు హాస్యము చేయుచు నిలబడియుండెను. అంతలో భక్తసమూహము శివనామమును కీర్తింపదొడగిరి. దానిని విని వ్యాధుడుగూడ "శివ శివ హర హర" అని చెప్పుచు ఆలయప్రదక్షిణము చేసి, భయంకరమైన అడవిలో ప్రవేశించెను. అతనికి శివనామోచ్చారణము అలవాటు అయ్యెను. "హర హర" అనుకొనుచు నాట్యము చేయుచుపోవుచుండెను. శివ నామోచ్చారణ చే వాడు చేసిన పాపములు తొలగిపోవుచుండెను. ఇంతలో సూర్యాస్తమయము అయ్యెను. కంటికి కాటుక పూసినట్లు అంధకారమంతయు అలముకొనెను. ఆ రాత్రి నిషాదుడు ఉపవానము చేసియుండెను. వేటకొరకై అతడు అక్కడక్కడ సంచరించుచుండకొద్ది దూరములో గొప్ప సరోవర మొకటి కనబడెను. అది తామరనవుష్పశోభితమై మిక్కిలి రమణీయముగా నుండెను. గట్టున ఆకాశమునంటు చున్నవేమో అనునట్లు కనబడు బిల్వవృక్షములు ఉండెను. యోగభ్రష్టులు మరల కర్మభూమిపై దిగి జన్మ పరంపరలను పొంది నట్లు ఈ బిల్వవృక్షములు సూర్యచంద్ర కిరణములను భూమిపై పడకుండ చేయుచుండెను. ప్రత్యేకించి ఆరోజు

మిక్కిలి అంధకారము ఆవరించియున్నందున ఆ ప్రాంతమంతయు చిమ్మచీకటితో నిండియుండెను. ఒకానొక బిల్వవృక్షము నెక్కి ఒకకొమ్మపై కూర్చొని, ఆ వ్యాధుడు విల్లును సంధించి, బాణములు తొడిగి, చుట్టును తిలకించెను. అతని దృష్టికి బిల్వదళములు అడ్డము వచ్చినందున కుడిచేతితో వాటిని త్రుంచి ఎడమ చేతితో పారవేయ దొడగెను. అచ్చట క్రిందిభాగమున పవిత్రమైన శివలింగ మొకటి కలదు. వ్యాధుడు క్రిందికి పారవేయు బిల్వదళములు ఈ శివలింగము మీదనే పడుచుండెను. ఈశ్వరుడు ఆ బిల్వదళపూజలో మిక్కిలి సంతుష్ట డయ్యెను. ఆదినము తాను ఉద్దేశింపకయే ఉపవాస, జాగరణములు అనివార్యముగా అతడు చేసియుండెను. నీటిపై అలలవలె శివనామోచ్చారణము కూడ అతని నోటినుండి వెలువడు చుండెను. ఈ విధమైన శివస్మరణార్చనాది కృత్యములచేత ఆ వ్యాధుని పాపములు క్షయింపదొడగెను. ఇట్లుండ జాము ప్రొద్దుపోయిన తర్వాత నీరుత్రాగుటకై పూర్ణగర్భవతి అగు తేజోమయమైన ఒకానొక ఆడుజింక ఆ సరోవరము చేరి, సోపానములపై దిగుచుండెను. దానిని చూచిన వ్యాధుడు ఆ జింకను తనబాణమునకు గురిచేయ ప్రయత్నించుచుండగా వానిని ఉద్దేశించి ఆ లేడి ఇట్లు చెప్పదొడగెను. "ఆర్య! మాపై బాణమును ఎందుకు ఎక్కుపెట్టెదవు? నీకు నేను ఏమి అపచారమును గావించితిని?

గర్భవతి నయిన నన్ను వధించుట నీకు ధర్మమా? నాగర్భమునందున్న శిశువు అతిసూక్ష్మమై, అజ్ఞానావృతమై యున్నది. ఇట్టిస్థితిలో నీవు నాకు తొందర గల్గించినచో నీకు దారుణమైన పాపము గల్గును. "ఎట్టి అన్యాయము తలపెట్టని గర్భిణినయిన నన్ను చంపుట నీకు పాడిగాదు" అని జింక వ్యాధునకు హితవచనములు తెల్పెను. ఈ వాక్యములను విన్న బోయవాడు "ఓ మృగమా! నా ఆలుబిడ్డలు ఉపవాసముతో నారాకను ప్రతీక్షించుచున్నారు. నేనుకూడ ఈదినము ఉపవాసము చేయుచున్నాను. నీవు మనుష్యులవలె శాస్త్రోక్తమైన మాటలు చెప్పుట ఆశ్చర్యముగా నున్నది. నీయెడ నాకు సంపూర్ణమైన దయగల్గినది. నీవు పూర్వజన్మములో ఎవరు? నీ కిట్టిజ్ఞానము ఏట్లు గల్గినది? విశదముగా తెలుపు"మని ప్రశ్నించెను. లేడి ఈ విధముగా జవాబు చెప్పదొడగెను. "పూర్వము దేవదానవులు క్షీరసాగరమును మథించినప్పుడు పదునాల్గు స్త్రీరత్నము లుద్భవించెను. వాటిలో 'రంభ' యనబడు అప్సర నేనే! నా రూపలావణ్యములకు దేవతలు దిగ్భ్రాంతులైరి. నా లావణ్యవీక్షణములకు దేవతలు మత్స్యములవలె నాకు వశులైరి. నా శరీరపరిమళము నాఘ్రాణించుటకై భ్రమరములవలె మునులు నన్ను చుట్టిరి. నా మధురమైన సంగీతముచే అందరు తమశరీరములనే మరచి పరవశులైరి.

నేను స్వర్గభోగములను అనుభవించుచు మదముచే శివభజన. శివార్చన, మున్నగు సత్కర్మలను త్యజించి, మద్యము సేవించుచు దేవతలను మాని, హిరణ్యుడు అను రాక్షసుని చేపట్టి చాలకాలము గడపితిని. ఒకనాడు వాడు వేటకై పోయెను. ఇట్టి దుర్మార్గుని సహవాసముచే శివపూజాదివిధులనెల్ల మరచిపోవలసి వచ్చెనుగదా యని తలచి, ఒకానొక నాడు రాక్షసుడు వెళ్లిన సమయమందు నేను శివదర్శనార్థమై కైలాసమునకు పోయితిని. మహాపాపిని అయిన నన్ను శంకరుడు చూచి "నీవు మర్త్యలోకములో నీయిరువురు సఖులతోపాటు జింకగా పుట్టుము. హిరణ్యనామకరాక్షసుడుకూడ జింకగానే పుట్టి, మీ మువ్వురితో సుఖించుగాక" అని శాపమిచ్చెను. వెంటనే నేను పరమేశ్వరుని పరిపరివిధములుగా ప్రార్థించి, శాపపరిహారమును గూర్చి వేడుకొంటిని. శివుడు కరుణించి పండ్రెండు సంవత్సరములు జరిగిన పిదప మీకు శివప్రాప్తి గల్గును" అని అనుగ్రహించెను. శాపానుసారము మేము నలువురము కర్మభూమిపై జింకలుగా జన్మించితిమి. నేను గర్భిణినన్న విషయము నీకు తెలియును. నా శరీరమును కోరిన యెడల నా స్వస్థానమునకేగి బిడ్డను ప్రసవించి, మరల వచ్చెదను. అప్పుడు, నీవు నన్ను చంపి నాశరీరమును తినవచ్చును. ఇది సత్యమైన మాట" అని జింక విన్నవించెను. వ్యాధుడు జింక మాటలు విని యి

ట్లనెను "నీవు చెప్పునది నిజమే అయినను నీ మాటలలో నాకు నమ్మకముచాలదు. లోకములో ఎందరో ఎన్నోరకము లుగా అబద్ధములు చెప్పి, తమ శరీరములను కాపాడు కొందురు. కావున నీవు నిజముగా సత్యవాదినివి అయినచో ఏదైన ఒట్టుపెట్టుకొను'' మని చెప్పగా ఆ మృగము మహాదైన్యముతో నిట్లుచెప్పెను. "ఓ వ్యాధుడా! నేను నా మాటను తప్పినచో అనేక పాపములు నాకు సంభవించును. చేసిన ఉపకారమును మరచు కృతఘ్నునకు, ఇతరులను హింసించువానికి, భగవంతుని భజింపనివానికి, దానములకు విఘ్నముచేయువానికి, గురువును నిందించువానికి గల్గు పాపము నాకు ప్రాప్తించుగాక! లక్ష్మీపతి అయిన విష్ణువును, పార్వతీపతి అయిన శివుని నిందించువారికి, దానమిచ్చి పిదప దానిని మరల తీసికొనువారికి, వచ్చు పాపము నాకు సంభవించు గాక! స్వధర్మభ్రష్టునకు, శాస్త్రమును నిందించువారికి, భ్రష్టాచారునకు దేవాలయమునందుండి హరికీర్తనాది సత్కాలక్షేపములలో తాంబూలము వేసికొనునతనికి కుష్ఠురోగము సంభవించు నని శాస్త్రములలో చెప్పబడినది. అట్టి పాపము నాకు సంభవించుగాక! తాను విద్యావంతుడై ఇతరులకు ఆ విద్యను దానముచేయక దాచువానికి శకునపక్షి జన్మమువచ్చును. సజ్జనులను అనవసరముగా బాధపెట్టువానివంశము నిర్వంశమగును.

స్వామి ద్రోహము చేయువాడు కుక్క అగును. సేవకులతో సేవచేయించుకొని, వారికి జీతభత్యములివ్వని యజమానులు భిక్షగాండ్రు అగుదురు. వంటపదార్థములను దొంగలించువారు పిల్లిజన్మమెత్తెదరు. అతిథి అభ్యాగతులకు, మంచిఆహారము పెట్టక, తానుమాత్రము మృష్టాన్నము భుజించినయెడల పతితుడగును. తల్లిదండ్రులను దుఃఖపెట్టువాడు కోతిగా పుట్టును. నేను ఇక్కడికి నామాటమేరకు మరల రాకపోయినయెడల ఈ పాపము లన్నియు సంభవించును. నామాటలు తప్పినచో శివపూజకు విఘ్నము కలిగించిన దాని వల్ల వచ్చు పాపమునకు గురియగుదును" అని జింక ప్రతిజ్ఞ చేసెను.

బోయవాడు ఈ మాటలు విని ఆశ్చర్యభరితుడై జింకతో తన పనిని త్వరగా ముగించుకొని రావలసినదిగా అనుమతించెను. అట్లు అనుమతించిన బోయవానికి శుభములను కోరుచు సరోవరమునందలి నీరుత్రాగి, ఆ జింక తన తావునకు పోయెను. ఇక్కడ బోయవాడు తన యెడమ చేతితో బిల్వదళములను త్రుంచి, పారవేయుచుండెను. రెండుజాములవరకు బోయవాడు వేయుచున్న బిల్వదళములతో తనకు ఉత్తమమైన పూజ జరిగినందున ఈ చెట్టుక్రిందగల శివుడు పరమసంతోషమును పొందెను. దానివలన ఏడు జన్మములనుండి ఆ బోయవాని

నా(శయించిన పాపములలో సగభాగము భస్మమాయెను. శివనామోచ్చారణయందు వానికి ఆసక్తి గల్గెను. జింక చెప్పిన పవిత్రమైన మాటలు వినినందున సత్కాలక్షేపముద్వారా ఆ బోయవాడు జాగరణము చేసినట్లు అయ్యెను.

ఆ జింక వెళ్లిన తరువాత వ్యాధుడు శివనామస్మరణ చేయుచు, బిల్వదళములను గిల్లి, క్రింద వైచుచుండెను. కాలము నిలువదుకదా! రెండవజాము పూర్తికావచ్చినది. ఇంతలో నీరు ద్రాగుటకై ఒక ఆడుజింక అచ్చటికి వచ్చెను. "దీనిని వదలను" అనుచు వేటగాడు బాణమును సంధింపగా, కలత చెందిన జింక "నేటితో నా ఆయుస్సు తీరినది" అనుకొని, ధైర్యము వహించి, "అయ్యా! శబరా! కొంచెము ఆలోచింపుము. నీరు ద్రాగుటకై నే నిక్కడికి వచ్చితిని. మొదట తనివిదీర నీరు ద్రావ నిమ్ము. ఇంట చిన్న చిన్న బిడ్డలున్నారు. వారినొక్కమారు పల్కరించి, సంతోషపరచి వత్తును. సంతానవ్యామోహమనునది సహజముకదా! ఐహికసుఖోప భోగమోహము నాకును తప్పకున్నది. త్వరగా ఇల్లుచేరి, భర్తను, సంతానమును దర్శించి, తిరిగి వత్తును. ఇంతమాత్రము ఔదార్యము నాపై చూపుము. నన్ను విశ్వసింపుము. నాకడసారి కోర్కెను మన్నించి, ఈ సాహాయ్యము చేయుము. నీ మేలు ఎన్నటికి మరువను" – అనెను. ఈ మాటలు విన్న వ్యాధుడు "చాల బాగున్నది!

ఇటనుండి వెళ్లి, నీవు తిరిగి వత్తువా? ప్రాణములు మిక్కిలి తీపియైనవి. ప్రాణములు కోల్పోవుటకు ఎవ్వరును రారు. నీ మాటపై నాకు నమ్మకము లేదు. కనుక ప్రమాణము చేసి, ప్రయాణము కమ్ము" - అనెను.

అంతట జింక "అయ్యా! పుణ్యాత్మా! ఆడిన మాటను తప్పి, నేను రాకున్నచో - బావులను, గుళ్ళను, గోపురములను కూల్చువారును, వేదశాస్త్రములను నిందించువారును, సాధు సజ్జనులను హింసించువారును, పురాణపుణ్యకథలను దూషించువారును - ఏ పాపము నొందుదురో, అట్టి పాపమును నేనును పొందుదును. అన్నదమ్ములయ్యును కడుపుమంటతో (ఈర్ష్యతో) ఒకరినొకరు హింసించువారు తమ ఐశ్వర్యమును కోల్పోవుదురు. ప్రత్యక్షమున మంచిగా మాట్లాడి, పరోక్షమున నిందించువారు కొంగలగుదురు. గురువునందలి దోషములను వెదకువారిసంపదలు సర్వనాశనమగును. తల్లిదండ్రులను, గురువులను కష్టపెట్టువారును, మూగజీవులకు నీరు మేత పెట్టని వారును, మూగవారై పుట్టుదురు. నేను తిరిగి రాకున్నచో ఇట్టి పాపము లన్నియు నన్ను చెందునుగాక! మరణమునుగూర్చి నాకు ఆవగింజంతయు బాధ లేదు. పుణ్యాత్మ! అంత్యకాలమున నా మనోవాంఛను నెరవేర్చి, పుణ్యముగట్టుకొమ్ము. త్వర త్వరగా పోయి వత్తును. అనుమతింపుము" - అని ప్రమాణములు చేసెను.

వ్యాధునికి జ్ఞానోదయకాలము సమీపించినది. శాశ్వత సుఖములు లభింపనున్నవి. కనుకనే కఠినాత్ముడైన వ్యాధుని మనస్సు మెత్తపడుచున్నది. కరుణారసము కట్టలు తాకుచున్నది. జింకను కరుణించి, 'పోయి ర'మ్మనినాడు. జింక మిక్కిలి సంతోషించి, కడుపునిండ నీరు ద్రావి, వ్యాధుని ప్రశంసించుచు - ఇంటికి వెళ్లినది. మంచికాలము చేరువగునప్పుడు - మంచిబుద్ధియు చేరువగునుకదా! కొంతసేపటికి ఆ సరోవరమునకు నీరు ద్రాగుటకై మగజింక వచ్చెను. వెంటనే వ్యాధుడు బాణమును సంధించెను. వానిని చూచి జింక ఇట్లు చెప్పెను. "ఓ శివభక్తుడా! సుగుణవతులై పతివ్రతలైన నా భార్యలకు కొన్ని విషయములను చెప్పి, నేను వెంటనే ఇక్కడికి వచ్చెదను. నేను అట్లు రానిచో నా శపథములను వినుము. పరమభక్తుడు హరకీర్తన చేయు సమయమున దానిని భంగపరచువాని వంశము నిర్వంశమగును. అట్టి పాతకము నాతలపై పడుగాక! సజ్జనులను హింసించు వారికి, సంతానము వృద్ధికానేరదు. దేవతావిగ్రహములను భంగము చేయువారు, శివమహిమను తృణీకరించువారు, ఘోరమైన నరకమును పొంది, కీటకము లగుదురు. లేనిపోనివాటిని అతిశయోక్తితో చెప్పువారికి కప్ప జన్మము కలుగును. పురాణములు జరుగుచోట నిద్రించువారికి పెనుభూతజన్మము వచ్చును. నేను మరల

ఇక్కడికి రానిచో ఈ పాపము లన్నియు నాకు కలుగుగాక!" అని వాగ్దానము చేసి, పోయివచ్చుటకు, వ్యాధుని అనుమతిని అర్థించెను. అమృతోపమానములైన ఆ జింకమాటలను విని, వ్యాధుడు ఆనందబాష్పములతో, పోయివచ్చుటకు జింకకు అనుమతినిచ్చెను. నీరుత్రాగి ఆ జింక తనయింటికి వెళ్లెను.

వ్యాధుడు శివనామస్మరణచేయుచు బిల్వపత్రములను శివలింగముపై వేయుచు, ఆ వృక్షముపైననే కాలము గడపుచుండెను. ఈవిధముగా నాల్గు జాములలోను శివునకు పూజ జరిగెను. వ్యాధుని పాపరాశియంతయు సమూలముగా భస్మమయ్యెను. అప్పటికి తెల్లవారెను. సూర్యభగవాను డుదయించు చుండెను. కొంతసేపటికి మూడవ ఆడుజింక ఆ సరోవరము దగ్గరికి వచ్చెను. దానిని చంపుటకు బాణమును గురిపెట్టగా అది యిట్లు చెప్పెను. "అయ్యా! నన్ను చంపవద్దు. నా బిడ్డకు పాలిచ్చి వెంటనే యిక్కడికి వత్తును. ఆపై నీ యిష్టము వచ్చినట్లు చేయుము" అని ప్రార్థించెను. వ్యాధుడు అప్పుడు ఈ జింక ఎట్టి ధర్మములను చెప్పునో వినవలెనను కుతూహలముచే జింకను ప్రతిజ్ఞాపూర్వకముగా మాట యిమ్మని కోరెను. అప్పు డాజింక ఇట్లు చెప్పెను. "గడ్డివామికి, గ్రామమునకు నిప్పు పెట్టువారు, గోమాతకు ఉపయోగపడునీటిని అడ్డగించువారు, క్షయరోగపీడితులగుదురు. ఇతరుల వస్తువులను

దొంగలింపగోరువారు, మంచివారికి జరుగు సమ్మానమును చూచి అసూయపడువారు, నేత్రరోగములతో బాధపడుదురు. పుస్తకములను దొంగలించువారు మూగవా రగుదురు. భక్తులను నిందించువారినోరు దుర్గంధపూరితమగును. ద్రవ్యమును ఖర్చు చేయక లుబ్ధు డగువాడు బుసగొట్టుచున్న మహాసర్పమగును. భిక్షకై వచ్చిన యతిని బయటికి పంపు పాపి, శివుని ఆగ్రహమునకు పాత్రుడగును. వానిసంతతి, సంపద దగ్ధమగును. వడ్డించిన విస్తరివద్దనుండి బయటికి అతిథిని పంపువాడు మహాపాపి యగును. నేను నీ కిచ్చినమాట తప్పినచో ఈ చెప్పిన పాపము లన్నియు నాకు లభించుగాక!" అని చెప్పిన జింక యొక్క మాటలు విని గద్గదకంఠుడయి జింక పోయి వచ్చుటకు వ్యాధుడు అనుమతించెను. ఆ జింక నీరుత్రాగి యింటికి పోయి తన బిడ్డకు పాలిచ్చి దానిని తృప్తిపరచెను.

గర్భిణిగానున్న ఆడుజింక ప్రసవించెను. రెండవ ఆడుజంక తన ఆశయము తీర్చుకొని, సంతసించెను. వీటి యజమానుడైన మగజింక ఆ మూడుజింకలను చూచి తా మిచ్చిన మాట ప్రకారము వెంటనే వ్యాధునివద్దకు పోవలసినదిగా ఆనతియిచ్చెను. తమ పిల్లలతోపాటు ఆ జింకలన్నియు వ్యాధుని వద్దకు వచ్చెను. మగజింక ముందు నిలబడి మొదట తన్ను చంపవలసినదిగా బోయవానిని

ప్రార్థించెను. అపుడు ఆడుజింకలు "ఓ వ్యాధుడా! అట్లు చేయుట ధర్మముకాదు. భర్తకంటె ముందుగా భార్యలు చనిపోవుట ఉచితము" అని చెప్పగా తల్లిదండ్రుల మాటలు విన్న చిన్న పిల్లలు అంతఃకరణశుద్ధితో ముందు నిలిచి "మొదట మమ్ములను చంపుము. ఎందువలన ననగా తల్లిదండ్రులను పోగొట్టుకొన్న పిల్లల జీవితము మహాదుః ఖభాజనముకదా" అని ప్రార్థించిరి.

ఆ బిడ్డలు చెప్పిన మాటలకు ఈ వేటగాని హృదయము కరగిపోయెను. వెంటనే వాని కన్నుల నుండి ఏకధారగా అశ్రువులు రాల నారంభించెను. మిక్కిలి దయార్ద్రచిత్తముతో వ్యాధుడు "ఓ పవిత్రజీవులారా! ధర్మఫలదర్శకమైన మీ హితబోధ విని నేటికి నేను పరమపవిత్రుడనైతిని. జన్మజన్మాంతరములనుండి చేసిన పాపము లన్నియు దగ్ధమై, నాశరీరము పవిత్రమయ్యెను. నా పాలిటికి తల్లి, తండ్రి, గురువు, దైవము అన్నియు మీరే! ఆలుబిడ్డలతో చేరిన సంసారము కేవలము భ్రాంతినిలయము. శివ! శివ! శివపదవి ఎపుడు ప్రాప్తమగునో!" యని ప్రేమభరితముగా చెప్పుచు నిలబడెను. ఆ సమయమునకు సరిగా కైలాసమునుండి విమానము ఒకటి వచ్చెను. దానిలో ప్రమథులు కూర్చొనియుండిరి. వారిమధ్య పంచముఖములు, పది భుజములు, వ్యాఘ్ర చర్మమును ధరించిన సర్వమంగళ

కర్తయగు శ్రీ శంకరుడు దివ్యమైన తేజస్సుతో విరాజిల్లు చుండెను. కిన్నరులు మధురమనోహరమైన వాద్యములను వాయించ నారంభించిరి. విద్యాధరులు రాగాలాపన చేయదొడగిరి. పుష్పవృష్టి కురిసెను. జింకలన్నియు దివ్యశరీరములను పొందెను. వానిని చూచిన వ్యాధుడు వారికి సాష్టాంగనమస్కారముచేసెను. వాని మనోభావములు మారిపోయెను. లోహము స్పర్శమణియొక్క స్పర్శచేత బంగారగునట్లు వ్యాధుడు శివరూపమును ధరించి నిలిచెను. వానిని కూడ విమానములో కూర్చుండజేసిరి. తమదివ్య శరీరములతో జింకలుకూడ విమానమెక్కెను. దేవసమూహమంతయు ఆ శివభక్తులను స్తుతించ నారంభించిరి. శివరూపమును పొందిన వ్యాధుడు శివలోకము నలంకరించెను. జింకలు నక్షత్రమండలమును అలంకరించెను. ఈనాటికి నక్షత్రమండలములో ఆ జింకలు మృగశీర్ష నక్షత్రముగాను, దాని వెనుక ప్రకాశించు నక్షత్రము వ్యాధుడుగాను ప్రకాశించు చుండుటను పుణ్యవంతులు చూడగలుగుచున్నారు.

శ్రీవ్యాసభగవానుడు పవిత్రమైన ఈ కథను స్కాంద పురాణాంతర్గతబ్రహ్మోత్తరఖండమందు లింగకారణమున పేర్కొనినారు. పరమేశ్వరుని కృపా విశేషమున దానిని సంగ్రహముగా ఇందు పొందుపరచితిని. శివరాత్రి మహిమ

అనంతము. ఈ కథలను భక్తి శ్రద్ధలతో పఠించు వారిని పరమ శివుడు సర్వదా సంరక్షించును” అని వివరించెను.

సమాప్తము

శ్రీ సాంబ సదాశివార్పణ మస్తు!



